ఉక్త్యా=మాటచేత. వదాన్య=దాత. త్యాగ అభావః=గాగియొక్క లేమి....
శృఙ్ఖలైః=సంకిళ్లచేత. శాసనపత్త్రైః= (దాన) శాసనపురేకులచేత.

పత్నీ= భార్య. సపాద శతమ్=పాతికతోకూడిన నూఱు, అనఁగా నూటయి రువదియైదు.... భపకాః=కుక్కలు....దధార=ధరించెను.

34. పు. రిక్తి శాఖినః కృపాణీ వాణీ=దారిద్ర్యమనెడు చెట్టునకు కత్తియయిన విద్య (ఎప్పుడును కాశీపట్టణమువిద్యాస్థానము).

దే వేతి= (తా.) ఓ రాజా నీ కీర్తియను సముద్రములో మునుఁగుచున్న దారిద్ర్యమునకు మదపుటేనుఁగులదొర (౧ మదపుటేనుఁగులుకలవాఁడు, ౨ గొప్పమదపుటేనుఁగు) ఎవఁడును (ఏదియు) చేపట్టును (తొండముయొక్క పట్టును) ఇయ్యఁడు (ఇయ్యదు).

వింశతిమ్=ఇరువదింటిని. విలోచనః=గ్రుడ్డివాఁడు....దదానమ్ = ఇచ్చుచున్న వానిని. వదన= ముఖము.

ఘట ఇతి =(దం.) కుండ పుట్టువునకు చోటు, లేళ్లు పరివారము, బుజపత్త్రి వస్త్రము, అడవిలో నివాసము, దుంపలు మొదలయినవి ఆహారము; ఇట్టి గుణముగలవాఁడు అగస్త్యుఁడు సముద్రమును ఎండుచేత చేసెనో (ధరించెనో) (అమ్భోజ=) కమలమునంటి (కర=) అరచేతియొక్క (కుహరే=) పల్లములో (అం=చేత) కార్యసిద్ధి మహిమయందున్నది గొప్పవారికి, లేదు సాధనములో.

మూల్యమ్=ఖరీదు. రథ స్యేతి= (దం.) రథమునకు ఒకటే చక్రము, పాముల తో కట్టఁబడినవి ఏడుగుఱ్ఱములు, (కాలు ఊనుటకు) పట్టులేనిది దారి, కాళ్లు లేనివాఁడు (అనూరుఁడు) సారథికూడ; సూర్యుఁడు పోనె పోవుచున్నాఁడు అంతమునకు ప్రతిదినము హద్దులేని యాకాశముయొక్క; కార్యసిద్ధి....

35. పు. విజేత వ్యేతి= (దం.) జయింపవలసినది లంక, కాళ్లతో దాఁటవలసినది సముద్రము, శత్రువు పులస్త్యబ్రహ్మయొక్క మనుమఁడు రావణుఁడు యుద్ధభూమిలో సహాయులా కోఁతులు, కాలుబంటు మనుష్యమాత్రుఁడు (రాముఁడు), ఇతఁడు సమస్తమును సంహరించెను రాక్షసకులమును; కార్యసిద్ధి....

చమ్పకలతామ్=సంపఁగితీఁగను. స్నుసామ్=కోడలిని.

ధను రితి= (దం.) ధనుస్సు పువ్వులది, నారి తుమ్మెదలమయము, చంచలదృష్టులుగల స్త్రీల దృష్టులయొక్క అగ్రము బాణము, చెలికాఁడును మందమతియైన (జలస్వరూపుఁడైన) చంద్రుఁడు, తాను ను ఏకాకి దేహములేనివాఁడు (మన్మథుఁడు), సకల లోకమును కలఁతపెట్టుచున్నాఁడు; కార్యసిద్ధి....

అనర్ఘాన్=వెలలేని.

పన్థా ఇతి=(దం.) ఓ దారీ తగ్గింపుము దూరమును, వదలుము నీ కఠోర తేజము ను ఓసూర్యుఁడా, ఓ శ్రీమంతుఁడా వింధ్యపర్వతుఁడా కరుణింపు దయతో, ఇప్పుడే దగ్గ అను రమ్ము: ఈప్రకారము దూరము పరుగెత్తుటచేత ఆయాసముగలదైనట్టి చూచి తమప్రి యాను ఓశ్రీమంతుఁడా భోజరాజా నీ శత్రువులు ప్రతిదినమును మొఱపెట్టుచున్నారు, మూర్ఛపోవుచును ఉన్నారు.

ప్రాన్తేషు=అంచులయందు. ముమోచ=వెట్టెను.

36. పు. మృగయా రసేన=వేఁట తమిచేత. వరాహమ్=పందిని. అమర వాణీ పరి జ్ఞానమ్= దేవభాషా (సంస్కృతభాషా) జ్ఞానము. కలమాన్=వరిని.

కలమా ఇతి=(దం.) వరిపైరు పంటచేత వంగినదై క్రిందిప్రదేశమునుండి ఆఘ్రాణిం పఁబడిన పరిమళముగల యెట్టిగలువలుగలదై, గాలిచేత కొంచెము కదపఁబడిన తలలు దై, మిక్కిలి చేయుచున్నది పరిమళముయొక్క పొగడుటను.— వరిపైరు పంటచే వంగు టయు తలలు (ఎన్నులు) గాలికి కదలుచుండుటయు ఎట్లున్నదనఁగా ఆపైరు తనచెంత నున్న ఎఱ్ఱగలువల తావిని వరివెన్నులకొనలచే (క్రిందినుండి) యెగఁబీల్చుటగాను ఆతావికి తల యూచుటగాను ఉన్నది అని యర్థము.

న తే అభిధాస్యామి=నీకు చెప్పను.... నిధానమ్=నిక్షేపము. జ్ఞాపయితుమ్ అ భ్యాగామ్=తెలియఁజేయుటకు వచ్చితిని.... ఉత్థాప్య=లెఱచి.

రాజన్ ఇతి=(తా.) ఓరాజా నిన్ను భూలోకమునకు వచ్చినచంద్రునిఁగా చూ చి, రత్నరాశియను మిషచేతను నక్షత్రములు (చంద్రుని భార్యలు) సయితము వచ్చిన వని తలఁచెదను.

లోకోత్తరమ్=లోకముకంటె మైదానిని (సర్వశ్రేష్ఠమును).

37. పు. ఆబద్ధేతి= కట్టఁబడిన మాయ(సటా=) జూలుచేత దట్టమయిన (భిత్తిః=గోడ—అంసః=మెడ) గోడవంటి మెడగలదైన కుక్క ఎక్కింపఁబడెనేని సిం హముయొక్క అధికారమును (అధికారమందు) మదపుటేనుఁగుయొక్క గట్లవంటి కుం భస్థలములను పగులఁగొట్టుటయందు ఆసక్తమయిన సింహముయొక్క ధ్వనిని చేయునా ఏమి?.

ఆపన్నః=ఆపదలోనున్నవాఁడు. న వైదుష్యమ్=పండితులకుఁదగినదిగాదు. ఉప పన్నమ్=(చేతికి) దొరకినది.... ప్రజాపతేః=బ్రహ్మయొక్క

38. పు. అంశుకమ్=వస్త్రమును. తపన కర క్లాన్త=సూర్యుని కిరణములచేత వాడిన.

లుబ్ధక వధూః=బోయవానిభార్యను, లేక, బోయదానను. పలమ్=మాంసము. క్షౌమమ్=కొంచెము. సహజ మితి—వా స్తవమును చెప్పెదను రాజా(ఆదరాత్=) దయతో (శ్రూయతే=) వినఁబడుచెడల: పాడుచున్నారు నీ శత్రువుల భార్యల (అశ్రు=) కన్నీటి యేళ్లతీరములయందు సిద్ధ స్త్రీలు; పాటచేత గ్రుడ్డివై గడ్డిని మేయుట లేదు లేళ్లు; అందుచేత మాంసము దొరక లేదు.

గవాక్షే=కిటికీలో.

ఇత ఇతి=(దం). ఇక్కడ ఇక్కడ నీళ్లచే పగులఁగొట్టఁబడిన దరిగలది అనకట్టు సముద్రముయొక్క; ఇటువైపు (దుర్లఙ్ఘ్య=) దాఁటరాని (ఆత్మా=) స్వరూపముగలది విస్తారమయిన మంచు బురదగల కొండ యిది; ఇప్పుడు జరుగఁగా ఏనుఁగులయొక్కయు గుఱ్ఱములయొక్కయు నీరాజనకృత్యము, (న జానే=) ఎఱుఁగను పోవుదురో నీ శత్రువులు ఏమార్గముచేత. (ఎటు పోవుటకును మార్గము లే దని తా. ఏనుఁగులకును గుఱ్ఱములకును ఆరతి యెత్తుటచేత జయము కలుగును.)

హయమ్=గుఱ్ఱమును. ప్రతస్థే=బయలు వెడలెను.... ఆరోపిత ఇన్ధనమ్=మోపఁబడిన వంటచెఱకుగలవానిని.

కియన్మానం జలం విప్ర=ఓ బ్రాహ్మణుఁడా నీరు ఎంతకొలతగలది? (ఎంతలోఁతు అనక ఎంతకొలత యని యడుగుట పొరఁబాటు.) జాను దఘ్నం నరాధిప = మోఁకాలిలోఁతు రాజా. (బ్రాహ్మణుఁడు లోఁతును స్పష్టముగా తెలియఁజేయు దఘ్నచ్ ప్రత్యయమును ప్రయోగించి మానశబ్దప్రయోగమందలి పొరఁబాటును తెలిపినాఁడు.)

39. పు. దాపయతి=ఇప్పించుచున్నాఁడు, అనఁగా, ఇమ్మన్నాఁడు.

రాజ న్నితి=(దం.) రాజా బంగారపు ధారలతో నీవు అంతటను వర్షించుచుండఁగా, దౌర్భాగ్యమను గొడుగుచేత కప్పఁబడియున్న నావిూఁద (న ఆయాన్తి=) పడవు బిందువులు.

త్వయీతి—అ. మేఘుఁడవయిన నీవు వర్షించుచుండఁగా (అవర్షముచేత) అన్ని (ద్రుమాః=) చెట్లును (పల్లవితాః=) చిగిర్చినవి, జిల్లేడు చెట్లమయిన మాకు ముందున్న యాకులయందు సందేహము. (ఇతరులకు నీవు విశేషముగా బహుమానము లిచ్చుచున్నావు. నాకు నీవలన సంభావన లేదు సరియే గదా, నాకట్టెలమోపు కూడ పోవునని భయ మగుచున్న దని తా.)

ఏక మితి—అ. ఇతని (భోజుని) యుద్దేశ్య మొకటి ప్రయత్న ము మఱియొకటి; ఇతరునికి (సరాబునకు) పనిలో భయము లేదు. సదా సూర్యునిచేత (భోజునిచేత) తఱు

మంబడుచు నేయున్నది (యున్నాను), సదా చీంకటి (నేను) పరువెత్తుచు నేయున్నది (యున్నాను).

జానుదఘ్న ప్రభాషణాత్=(జానుమానమ్ అనక) జానుదఘ్నమ్ అన్నందునకు. దారిద్ర్య విడమ్బితః=దారిద్ర్యముచేత వంచితుండు.

**40.** పు. కా స ఖేతి=(తా.) శుకుండు। దేనికి సంతోషింపండో అది యేమిసభ? ఇత్యాది. సూత్ర బద్ధాః=దారముతో కట్టివేయంబడిన. మిత్ర=సూర్యుండు, చెలికాండు. ఔర్వః=బడబానలము. బాడబ=బడబానలము, బ్రాహ్మణుండు. తటిత్ = మెఱపుతీంగ.

**41.** పు. చిన్తామణిభిః జగత్ నో జీవితమ్=చింతామణులచేత ప్రపంచము బ్రదికింపంబడ లేదు. నిరన్తరం జల భరైః తామ్ ఉర్వరాం సిక్త్వా ధారేయేణ అద్య ధురం వహతా అమ్భోదేన త్వయా జగత్ జీవితమ్ మన్యే=సదా నీటి బరువులచేతను ఆ సర్వసస్యాఢ్యయయిన భూమిని తడుపుచున్న భారమువహించునట్టి (యు) ఇప్పుడు భారమును వహించుచున్నట్టి మేఘుండవయిన నీచేత లోకము బ్రదికింపంబడినది (అని) తలంచుచున్నాను.

భిత్త్వా=గోడలో. వ్యక్తాని=స్పష్టమయిన. సంచిత=కూడంబెట్టిన.

వ్యఙ్గాః=అంగహీనులు. కుష్ఠినః=కుష్ఠరోగులు. పఙ్గవః=కుంటివారు. అశ్నన్తి= అనుభవించుచున్నారు. దేహినః = ప్రాణులు....ప్రమోదభరాత్ = సంతోషాతిశయముచేత.

చేతోహరాః=మనోహరమయినవారు. ప్రణయ గర్భ గిరః=అనురాగ యుక్తమయిన వాక్కుకలవారు. వల్గన్తి=నడచుచున్నవి. దన్తి నివహాః=ఏనుంగుల సమూహములు. తరళాః=చంచలములయిన....నయననోః సంమీలనే = కన్నులయొక్క మూయుటయందు, కన్నులు మూసినప్పుడు, వచ్చినప్పుడు.

**42.** పు. పణ్యవీథ్యామ్=బజాఱులో. పట్టమయూరాని=పట్టువస్త్రములు. రాజకీయాః=రాజసంబంధమయినవారు. నికటే=సమీపమునను. పటమ్=వస్త్రము.

భేకై రితి=(దం.) కప్పలు (కోటరే=) రంధ్రములలో (శాయిభిః=) శయనించునవి చచ్చినట్లే (పడియుండినవో), (క్ష్మా అన్తః=) భూమిలోనికి చొచ్చినవో తాంబేళ్లు, కొఱ్ఱచేపలు గొప్ప బురద బల్లలమీంద పొర్లుటచేత ఎంతలో (ఏయుండనప్పులో) మాటిమాటికి మూర్ఛపోయినవో, ఆ యెండు సరస్సులో అకాలమేఘము వచ్చి దానిని (ఆపనిని) చేసినది, దేనిచేత (ఏపనిచేత) కుంభస్థలమువఱకు మునింగిన యడవి యేనుంగుల యొక్క సమూహములచేత నీరు త్రాగంబడుచున్నదో.—మహావృష్టిచే తటాకము నిండెనని తా. ఒకానొకండు ఆకస్మికముగా వచ్చి నాకు అమితధన మిచ్చెనని భా.

విష్ణ్వాఖ్యః=విష్ణువను పేరుగలవాఁడు.

ధారాధీశేతి=ధారా (పట్టణపు) రాజా భూలోకమందలి మహేంద్రులను లెక్కపెట్టుటయందు ఉత్సాహము గలవాఁడై దేనిని ఈ బ్రహ్మదేవుఁడు నీలెక్కను చేసెనో బలపపు ముక్కతో గీఁతను ఆకాశమందు (నిన్నుఁ దెలిపెడు లెక్కగా ఏగీఁతను ఆకాశమున బలపపుముక్కతో బ్రహ్మదేవుఁడు గీచెనో) అది (ఆగీఁత) యే యీ దేవనది (ఆకాశగంగ) ఆయెను; నీ సాటి రాజు లేనందున (ఇంకొకగీఁతకు ప్రసక్తి లేనందున) దానిని (ఆబలపపుముక్కను) (బ్రహ్మ) పాఱవేసినాఁడు; అదే యిది భూమి మీఁద మంచుకొండ.

జీర్ణ మపి=చినిఁగినదయినను.

నిరవద్యాని=(దం.) నిర్దోషమయిన పద్యములు కలిగినయెడల దరిద్రునికి ఏమి లోపము? కటీ నిక్షిప్తః=చంకలో పెట్టుకొనఁబడిన.

43. పు. ఏతే ష్వితి=(అ.) అన్యోన్య బలమయిన గాలిచే (ఘూయమాన=) రేపఁబడిన దావాగ్నులచే కబళింపఁబడిన (ఏతేషు మహీరుహేషు=) ఈచెట్లమీఁద నీటిని ఓ మేఘుమా వదల వేని వదలకుము, పిడుగును మఱి పడవేసెదవు నిర్దయుఁడా ఏ హేతువుచేత?

శోచ్యతమే మయి=మిక్కిలి కనికరింపఁదగిన నావిషయమై. సోమనాథేన కల్పద్రుమాయితమ్=సోమనాథుఁడు కల్పవృక్షమువలె ఆచరించినాఁడు....వన వీరుధామ్=అడవి తీఁగలకు. న తరతి=ఇయ్యఁడు (ఇయ్యనియెడల).

ఫణా ఫలక స్థితామ్=పలకలవంటి పడగలమీఁద నున్నట్టి. కమఠ=తాఁబేలు. పయోనిధిః క్రోడాధీనమ్ కురుతే=సముద్రుఁడు రొమ్ములో పెట్టుకొనుచున్నాఁడు. చరిత్రవిభూతయః=చరిత్రైశ్వర్యములు, ఉత్కృష్టచరిత్రములు. నిస్సీమానః=హద్దులేనివి.

44. పు. సీదతా త్వత్ అభిముఖ విసృష్ట ఉత్తాన చఞ్చుపుటేన చాతకేన=పడియున్నట్టియు నీకు ఎదురుగా తెఱవఁబడిన వెదకిలఁబడియున్న ముక్కుడిప్పగలిగినట్టియు వానకోయిలచేత. అస్తామ్ తావత్=అటుండనిమ్ము.

ధిక్ జీవితమ్=బ్రదుకు నింద్యము, ఛీ ఈబ్రదుకేల. భాణ్డారిక=ఓ కోశాధికారీ.

జలధౌ=సముద్రమందు....యావన్తి ఆసన్=ఎన్ని యుండినవో. తావన్తః=అన్ని. ఉదార=ఓదాతా.

మా భూత్=కాకుండును గాక. ఇయమ్=ఈనక్షత్రరూపమున నున్న. దుశ్శీలతా భాజనమ్=దురాచారమునకు పాత్రము.

నిష్ణాతమ్=చక్కఁగా తెలిసికొనఁబడినది. ప్రసాదే=దయయందు. తృణకణా యతే=గడ్డిలేశమువలె ఆచరించుచున్నది (అగుచున్నది).

**45.** పు. క్షీరాబ్ధి తుల్యమ్=పాలసముద్రముతో సమానముగా. న క్షమతే=ఓర్వఁజాలదు. గ్రీష్మ ఊష్మణా=వేసవియొక్క వేఁడిచేత. వర్ష తావత్ కియత్=వర్షిం పుమా అందాఁక కొంచెము.

ఆస్తర ఆసన్నః=పడకకు సమీపస్థుఁడవు. ఉపవీత=జంధెము.

క్షుత్క్షామా ఇతి= ఆఁకటిచేత క్షయించిన శిశువులు శవములవలె (నున్నారు), బంధువులు మిక్కిలి మందమయిన (-ఆశయాః=) యభిప్రాయముగలవారు (ఆదరము మానినారు), అంటింపఁబడినది పగిలిపోయిన గరిగపిడత లక్క లేశములచేత, (ఇ దంతయు) నన్ను బాధింపదు.—(నా) భార్య వస్త్రము చినిఁగిపోయినను కుట్టుకొనుటకు స్వరవికారముతోఁగూడుకొన్న నవ్వును చేసి (నవ్వి), కోపగించుచున్నదైన యెదుటియింటి వాని ఇల్లాలిని సూదిని యాచించుట (నన్ను) ఎట్లు బాధించినదో అట్లు, (అని పూర్వమున కన్వయము.)

**46.** పు. అభ్యుద్ధృతా ఇతి=(దం.) చక్కఁగా ఉద్ధరింపఁబడినది (పాలింపఁబడినది, ఎత్తఁబడినది) భూమి, ఖండింపఁబడినది శత్రుసమూహము, గ్రహింపఁబడినది బలవంతునిచేత బలవంతులయిన రాజులయొక్క సిరి (బలిచక్రవర్తియొక్క ఐశ్వర్యము);—ఒకజన్మమందు చేయఁబడినదో ఏది యీయనావనవంతునిచేత, మూఁడు (వరాహ పరశురామ వామన) జన్మములలో దానిని చేసెను పురాణపురుషుఁడు (విష్ణుమూర్తి).

హరిణ్యాం బాణేన విద్ధాయామపి=లేడి బాణముచే కొట్టఁబడినను.

శ్రీభోజే ఇతి=(దం.) శ్రీమంతుఁడైన భోజరాజు వేఁటకు పోయినను, త్వరగా విల్లు ఎక్కు పెట్టఁబడినను, చెవికొనవఱకు వచ్చినను (అనఁగా నారిని చెవివఱకు ఆకర్షించినను), పిడికిటినుండి జాఱి బాణము దేహములో గ్రుచ్చుకొన్నను, (ఉన్న) చోటి నుండి పాఱిపోలేదు, కదలలేదు, వణఁకలేదు, దుముకలేదు, లేడి; 'నాకు వశ్యునిగా చేయును (నా) ప్రియుని మన్మథుఁడు ఇతఁడు' అనెడి యాశచేత. (భోజరాజు మన్మథుని వంటి సుందరుఁడని తా.)

జాహ్నవీ=గంగానది. విదుషీ=విద్వాంసురాలు.

భోజ ఇతి=(దం.) భోజునియొక్క ప్రతాపమను నిప్పు క్రొత్తది ఇది ప్రకాశించుచున్నది రాజుల(నెడి కొండల) పట్టణ(ములనెడి నెత్తముల) ప్రదేశములయందు; ఈ భోజప్రతాపాగ్ని ప్రవేశింపఁగానే శత్రురాజులయొక్క ఇంటి ముంగిళ్లయందు గడ్డిమొల

చుచున్నది (సామాన్యమయిన యగ్నికి గడ్డి కాలిపోవును, ఈయగ్నికి మొలచును అని దీనియందు అపూర్వత్వము. ఈయనప్రతాపమునకు జడిసి శత్రురాజులు తమపట్టణములు వదలి పాఱిపోఁగా అవి పాడై అందు గడ్డి మొలచె నని భావము.)

**47.** పు. శ్రీమ న్నితి=(దం.) శోభాయుక్తమయిన ఓగంధపుచెట్టా, కలవు అనేకములు ఆ చెట్లు అడవిలో వేనికి పరిమళముమాత్రము ఉండునో బహుళః పువ్వుల శోభతో (పువ్వు లున్నంతకాలమే). ప్రత్యవయవమందును చక్కఁగా చేయఁబడిన యా తెల్లని కొనియాడఁబడిన ప్రసిద్ధస్వరూపమయిన యే యీ పరిమళ గుణము నీ చేత (ప్రసిద్ధస్వరూపముగలయట్టి నీచేత ఏయీ పరిమళ గుణము) ప్రకటింపఁబడినదో ఎక్కడ అది (ఆపరిమళగుణము) ఇక్కడ (కడమచెట్లలో) చూడఁబడును?

సూత్రధారీ=నటి.

బలి రితి= (దం.) బలి (చక్రవర్తి) పాతాళము నివాసముగాఁగలవాఁడు క్రిందుచేయఁబడినాఁడు, ఆశ్చర్యము ఇందు ఏమి? క్రిందుచేయఁబడెను స్వర్గముననున్న దైనను ఆశ్చర్యము కల్పవృక్షము నీచేత! (బలికల్పవృక్షములకంటె భోజుఁడు దాత యనితా.)

సహకారతరోః=తీయమామిడి చెట్టుయొక్క....వితతాః=వ్యాపించినవి. పరిమళేతి=సువాసనయొక్క అతిశయముచేత కూడుచున్న తుమ్మెదల సమూహముచేత పీల్చఁబడిన చిగుళ్లుకలవైన చెట్లు కొంచెపాటివి.

**48.** పు. భాగ్యాధీనా = అదృష్టాధీనము....భూతి = ఐశ్వర్యము యొక్క. ధనసంచయ కర్తౄణి=ధనముయొక్క కూర్చుటయొక్క కర్తలు, అనఁగా ధనమును కూర్చునట్టివి. పృథ గేవ హి=వే ఱే సుమా.

ఆత్మాయత్త ఇతి=(దం.) స్వాధీనమైయుండఁగా గుణసమూహము, గుణములేమి నిందింపఁదగినది. అదృష్టాధీనములయియుండఁగా ధనములు, పురుషులకు ఏమి దోషము? (గుణహీనత దోషముగాని ధనహీనతగాదు అని తా.)

అస్ఖలిత...ప్రసరః = తడఁబడని...విజృంభణకలవాఁడు. వాఙ్మయ జాతమ్=వాక్స్వరూపముయొక్క సమూహమును. హస్త అమలకవత్=చేతిలోని ఉసిరికకాయవలె.

ధారాధరః ఇతి=(దం.) మేఘము (దారుగలది) నీకత్తి యిది, ఓరాజా ఆశ్చర్యము! వర్షించుచున్నవి శత్రు స్త్రీ జనముల కన్నులు; (వారు నీకత్తిచేత తమభర్తలు తెగఁగా ఏడ్చుచున్నా రని భావము). ధనముతో (జగతో) సర్వదా సాంగత్యములేమి యుద్ధములో దీనికి (నీకత్తికి), పేదఱికము కలుగుచున్నది (నీ) శత్రు రాజులకు (యుద్ధములో నీకత్తికి జడిసి శత్రువులు తమసిరి నంతయు నీ కిచ్చి పేదలై రని భావము.)

కిం జాత ఇతి=(దం.) ఏల పుట్టితివి (మొలచితివి) నాలుగుదారుల కూడికలో? మిక్కిలి దట్టమయిన నీడగలదానవు అయితివి ఏల? నీడచే కప్పఁబడినదాన వయినను ఫలములుగలదానవు అయితి వేల? ఫలభారములతో నిండినదానవయినను ఏల వంగితివి? ఓ మంచిచెట్టా సహింపుము ఇప్పుడు చాలసేపు కొమ్మలయొక్క అగ్రములయొక్క (అగ్రములను) లాగుట కదపుట త్రుంచుట విఱుచుట (ఈశ్రమలను) జనులవలననుఁడి నీయావేఅయినట్టి (చతుష్పథములో మొలచుట మొదలయిన) తప్పిదములచేత. (దుష్టుని కడకు వత్తురా? నీవు సౌమ్యుఁడవును దాతవును గనుక నీకడకు యాచకులు వచ్చుచున్నారు.—అని భావము.)

**49.** పు.—కూర్మ ఇతి=(దం.) తాఁబేలు పాతాళగంగయొక్క (భోగవతియొక్క) నీటియందు విహరించును గాక; ఆపాతాళగంగయొక్క గట్టున మొలచిన తుంగము స్తను గ్రహించునుగాక ఆదివరాహము; సడలించుకొనును గాక పడగల సమూహమును నాగేంద్రుఁడు; దిగ్గజములు తామరతూండ్లయొక్క భక్షణ వ్యాపారమును చేసికొనును గాక; పర్వత శ్రేష్ఠములు అన్నియు యథేచ్ఛముగా సంచరించును గాక; నీవు మోయుచుండఁగా ఓ ప్రభూ భోజా దేవతను భూమిని (భూదేవిని). (కూర్మాదులు సదా భూమిని మోయునవి, భూభారమును భోజరాజు వహింపఁగానే వానికి తమ సేవనుండి ఆటవిడుపు గలిగెనని భావము.)

వదాన్యః= దాత.

సంజల్పవత్ =ముద్దుమాటలవలె. ఏలా ఉశీర=ఏలకులు వట్టివేరు. లసత్ =ఒప్పుచున్న జాతీ...తామ్=సన్నజాజిపువ్వులు పాదిరిపువ్వులు మొగలిపువ్వులు—వీనిచేత పరిమళవంతముగాఁ జేయఁబడిన మంచినీళ్లు తేఁబడును గాక.

మాగధః=వంది.

వక్త్రాంభోజ మితి=(దం.) ముఖకమలములో సరస్వతీనది (విద్య) వసించియున్నది సర్వదా; శోణము నెను ఏతే (ఎఱ్ఱనిదే) అధరోష్ఠము నీది; చేయి శ్రీరాములవారి పరాక్రమముయొక్క స్మరణము చేయుటయందు (పరాక్రమమును జ్ఞప్తికి తెచ్చుటయందు) సమర్థమయినది దక్షిణదిక్కునునుండునది (కుడిది) నీది సముద్రము (ముద్దుటుంగరముగలది); నదులు (సేనలు) ప్రక్కను ఇవి ఎట్లును నీయొక్క. వదలనే వదలవు సదా; (ఈనదులు (సేనలు) సదా నీప్రక్క నేయుండును;) తేట గాయియుండఁగా మనస్సు, ఏలకలిగెను చెప్పుము రాజా నీకు నీళ్లు త్రాగుటకుకోరిక?

**50.** ఫ.—అష్టా వితి=(దం.) ఎనిమిది బంగారపు (వరహాల) కోట్లు, తొంబది మూఁడు ముత్తెముల తులలు (౧౦౦పలములు=౧తుల), ఏఁబది మదముయొక్క వాసన

చేత మదించిన తుమ్మెదలుగలట్టివి కోపముచేత గర్వించినయేనుఁగులు, గుఱ్ఱములు పదివేలు, లోకములో (చెల్ల) నేర్పుగల వేశ్యలు నూర్గురు, ఈయఁబడినట్టిది పాండ్యరాజుచేత కప్పము మాగధునికి ఇయ్యఁబడుచునుగాక.

శీతార్తమ్=చలిచే బాధపడుచున్నవానిని.

శీతే నేతి=(దం.) చలిచేత అధివసింపఁబడి మాఘమాసపు నీళ్లవలె,- చింతాసముద్రములో మునుఁగుచు చల్లారిన నిప్పుగలిగి పగిలిన క్రిందిపెదవిగలిగి (ఆనిప్పును) ఊదుచు ఆఁకలిచేత క్షయించిన కడుపుగల (వాఁడనైన)—నాకు, నిద్ర ఎక్కడికో అవమానింపఁబడిన ప్రియవలె వదలి దూరము పోయినది, మంచి పాత్రునికి దానముచేయఁబడిన సిరివలె క్షయింపకున్నది రాత్రి.

దివా=పగలు. జాను భాను కృశానుభిః=మోఁకాళ్లు సూర్యుఁడు నిప్పు వీనిచేత.

ధారయి త్వేతి=(దం.) ధరించి (=నీవు ధరింపగా) తమ (=బలికర్ణాదులయొక్క) స్వరూపమును, అధికమయిన యీవియే ధనముగాఁగలవాఁడా, ఇప్పుడు విడిపింపఁబడినారు బలిచక్రవర్తి కర్ణుఁడు మొదలయినవారు తమ కీర్తియనెడు రహస్యపు టింటిమండి. (బలికర్ణాదులకీర్తి రహస్యమైయుండెనేగాని భోజునికీర్తివలె జగద్విత్తము గాదనియు వారే భోజరూపమున అవతరించి ఇప్పుడు పూర్ణకీర్తిని పొందినారనియు వారికన్న నితఁడు అధికదాత యనియు భావము.)

కాన్త ఇతి=(దం.) ప్రియమైనదానవు (ప్రియమయినవాఁడవు), ఎల్లప్పుడును తియ్యనిదానవు (తియ్యఁగా పలుకువాఁడవు), రసముచేత నిండినదానవు (శృంగారరసములయందు ఆసక్తుఁడవు), మఱియు అగుదువు అయిదు బాణములవాని (మన్మథుని) ధనుస్సవు ఈడులేని (ఈడులేనిమదనచాపమవు) (మన్మథబాణమువలె స్త్రీలను మోహపెట్టువాఁడవు); ఓ చెఱకా (చెఱకుమిషచేత రాజును కవిసంబోధించినాఁడు) నీకు ఉన్నది సమస్తము మంచిది, ఒకటి లోపము, ఏమనఁగా భక్షింపఁపడి (ఆశ్రయింపఁబడి) పొందుచున్నావు రసహీనతను క్రమముగా.

**51.** పు.—శశాఙ్కమ్=చంద్రుని.

య దేత దితి=(దం.) ఏ యిది చంద్రునిలోపల మబ్బుయొక్క లేశముయొక్క విలాసమును చేయునో (మబ్బుముక్కవలె అగపడుచున్నదో) దానిని చెప్పును మనుష్యుఁడు (దానిని లోకు లందురు) కందే లని, కాదు నన్నుఁగూర్చి అట్లు (అది నా మతము గాదు).

సౌధాన్తరమ్=మేడలోపల.

అహ మితి=(దం.) నేనో చంద్రుని తలఁచెదను నీ శత్రువులతోడి విరహముచేత ఆక్రమింపఁబడిన జవరాండ్రయొక్క కడగంటిచూపులనెడు (ఉల్కా) కొఱకచ్చు

ల (కొఱకచ్చులు) (మీఁద) పడుటచేతనైన గాయముల (కిణ=) మచ్చల గుర్తులచేత చి
హ్నితమయిన దేహము గలవానినిగా.

మహాభాగ=మహానుభావుఁడా.

ప్రతివిహిత మృత్యు ప్రతిభియే=పోఁగొట్టఁబడిన చావుయొక్క భయము కలవా
నికి (అభయ మిచ్చి అనుట), ఉపరితన=పై. కృతే=కొఱకు. దశన కోటి క్షత గిరీన్=
దంతములకొనలతో పగుల్పఁబడిన పర్వతములు గలవైన. మద ముదిత కూజత్ మధులిహః
=మదముచే సంతోషించినవై ఝుంకరించుచున్న తుమ్మెదలు గలవానిని.

**52.** పు.—ఆమోదై రితి=(దం.) పరిమళములచేత వాయువులు, లేఁత చిగురుటా
కుల ప్రసరములచేత, నారచేత తాపసులు, పువ్వులచేత తుమ్మెదలు, పండ్లచేత పక్షులు,
ఎండచేత బాధింపఁబడినవారు నీడచేత, పలవలచేత మదపుటేనుఁగులు, నీచేతనే చేయఁ
బడినవి అన్నియు ధన్యములుగా; నీవు లోకోపకార సమర్థుఁడవయి యున్నావు. నీచేత
పోఁగొట్టఁబడిన యాపదగలవి కడమ చెట్లు. (ఓ రాజా నీవు సర్వజనోపకారివి అని తా.)

ఫణితిః=ఫక్కి. వమతి=క్రక్కుచున్నది. అనధిగత=పొందఁబడని.

అర్ధ మితి=(దం) సగము విష్ణుమూర్తిచేత, (విష్ణుమూర్తి ఒకప్పుడు మోహినియై
శివునికి భార్య యయినాఁడు. భార్య పురుషుని యర్ధదేహ మని శాస్త్రములు చెప్పుచున్న
వి.) పార్వతిచేత నయితము సగము శివునియొక్క హరింపఁబడినది; ఓ రాజా ఈప్రకార
ము భూతలమందు త్రిపురహరుని (శివుని) యొక్క లేమి వెల్లడియైయుండఁగా (అ
నఁగా శివుఁడే లేకపోఁగా), గంగానది సముద్రమును, ఆకాశమును చంద్రరేఖ, నాగేం
ద్రుఁడు భూమియొక్క యడుగును, సర్వజ్ఞత్వము ఈశ్వరత్వము పొందెను నిన్ను, న
న్నో భిక్షాటనము. (నేను మహాదరిద్రుఁడను నీవు మహావిద్వాంసుఁడవు మహైశ్వర్య
సంపన్నుఁడవు; నాదారిద్ర్యమును ఎఱుఁగుదువు, పోఁగొట్ట సమర్థుఁడవు: అని తా.)

**53.** పు.—అనురాగిణీ=అనురాగము (ప్రేమ) కలది. ఆశు=శీఘ్రముగా.

కేచి దితి=అ. కొందఱు వాక్కు అనెడు తీఁగయొక్క వేరునందు వ్యాపించిన
ఆశగలవారు (వాగ్వల్లియొక్క వేరునుమాత్రమే చూడఁగోరుదురు), మఱి కొంద ఱయిన
నో మొదటిపలవలతో సంబంధము పొందినవారు, నీడను కొందఱు పొందినారు, మూలా
గ్రములను. మఱికొందఱు, (మఱికొందఱు) చిగుళ్లను కోయుదురు, ఇతరులు పువ్వులను
చేత ధరింతురు, వారికన్న నితరులు పరిమళమునకు మాత్రమే పాత్రము; మఱి యేమనిన
మూఢులు పండును అహాహా నిశ్చయముగా చూడనైనఁ గోరరు.

పరిచ్ఛిన్న ఇతి= (దం.) పరిమితమైనది రుచి అమృతము బెల్లము మకరందము
తేనె పాలు వీనిది; (అమృతము, బెల్లము, మకరందము, తేనె, పాలు-అనెడిపదార్థము

లయందు రుచి కొంచెపాటిని గాక్షే యుండును); ఒకానొకప్పుడు పలుమాఱు అనుభవిం చుటచేత పొందును గదా రుచిహీనతను మిక్కిలి; (అట్లుగాక) ప్రియయొక్క దొండపం డువంటి పెదవియందును రసముగల కవివాక్యమునందును హద్దులేనిది క్రొత్తయానందము గలట్టిది చెప్పశక్యము గానిది ప్రకాశించును మఱి రుచి ఇది సాటిలేనిది.

నానీయన్తే ఇతి= (దం.) తేఁబడవు తేనెవిషయమైె తుమ్మెదలు పారిజాతపుష్ప ములచేత (మాయొద్దతేనె కలదు రండు త్రాగుఁడు అని తుమ్మెదలను పారిజాతపుష్పము లు పేరంటము పిలువవు. తుమ్మెదలు తమంతట తామే వచ్చి త్రాగును); ప్రార్థింపఁబడ వు చంద్రునిచేత వెన్నెలవిషయమై చకోరములు ; మా వాక్కుయొక్క మాధుర్యము యొక్క అతిశయమును పొంది (విని, ఎఱిఁగి) ముందుగా (మీఁదమీఁదఁ బడి) వచ్చు వారు (ఏ మయిన కవనము చెప్పుఁడు చెప్పుఁడు అని) బిగ్గరయైన మాటలుగలవారు (బి గ్గరగా ప్రార్థించువారు) అగుదురు తమంతట తామే పండితులు. ఏమి ఫలము (మాయొ క్క) వ్యర్థ ప్రార్థనలచేత ?

నాస్మాక మితి=(దం.) లేదు మాకు సవారి, లేదు ఏదియు కంకణములు (ఆద్య=) మొదలయిన యలంకారములయొక్క సత్కారము, లేదు ఎత్తయిన గుఱ్ఱము, లేఁడు ఎ వఁడును సేవకుఁడు, లేనే లేదు వస్త్రము సుందరమయినది; మఱి యే మనిన భూతలమం దుండు సమస్త విద్వాంసులకు సాహిత్య విద్యను పొందినవారికి మన స్సంతోషము చే యునది తల వంపు చేయునది విద్య దోషములేనిది కలదు మాకు (సాహిత్యవంతులగు సకలవిద్వాంసులను సంతోషపెట్టి వారిచే మాకు నమస్కారములు చేయించునట్టి విద్య నిర్దోషమయినది మాయందుఁ గలదు).

అః=ఇది కోపపీడలను లెలియఁజేయు నవ్యయము. ఇక్కడ కోపమును తెలుపు ను. మా కృథాః=చేయకు.

**54.** పు. నిశ్వాస ఇతి=(దం.) ఊపిరి సయితము బయటికిరాదు బాణకవి (బాణ ము) మనస్సున (రొమ్ములో) నుండఁగా. ఎట్లు (వచ్చును) మఱి ప్రసిద్ధమయిన యాడంబ రముతోడి (శ్లోక) పాదముల (అడుగుల) కట్టుపాటుగల కవనము (సరస్వతి) ?

హఠా దితి=(దం.) బలాత్కారముచేత లాగఁబడిన కొన్ని పదములను రచించున ట్టి మనుష్యుఁడు స్పర్థగలవాఁడు అగునేని అహహా కవితో వశ్యమయిన వాక్కుగలవా నితో (అటనుండి యొకపదమును ఇటనుండి యొక పదమును ఈడ్చి తెచ్చి వేసికొని యు న్లెడి మనుష్యుఁడు మహాకవితో పోటికి వచ్చునేని), కలుగును ఈదినమో రేపో, ఏల ఇ క్కడ పెక్కుమాటలు ? పాపిష్ఠయైన కలియుగములో, కుండలయొక్క (కుండలను) చేయు

వానినికి (కుమ్మరికిని) మూఁడులోకములయొక్క (—లను) చేయువానికిని (బ్రహ్మదేవునికిని) కలహము.

కలయతి=పొందును....శివసన్నిభః=శివునితో సమానుఁడైన (సర్వజ్ఞుఁడైన).

ముక్తాభూషణ మితి= (దం.) ముత్తెములు ఆభరణములుగాఁగలదిగా చంద్రబింబము ఆయెను. వెదచల్లఁబడిన నక్షత్రములుగలదిగా ఆకాశము (అయెను.) మన్మథునిదైన విల్లు పోయిన చాంచల్యముగలదిగా (నిశ్చలము) ఆయెను. నల్లఁగలువలు (రెండు) ముద్రగలవి (ముకుళించినవి) (అయినవి). అడఁగిపోయినది కోకిలలయొక్క మెల్లనయిన కూఁత. మెల్లనివాయువులు కుంఠనమైపోయినవి. చలనములేని పూగుత్తులు గలదిగా సంపంగితీఁగ అది ఆయెను. ఎఱుఁగను పిమ్మట.

(తా). (రతాంతమందు) ప్రేయసిముఖమందు చెమటబిందువులు గలిగి ముఖమునకు ఒక క్రొత్తశోభను గలిగించినవి. మెడలోని హారముల ముత్తెములు నడుమునై వ్యాపించినవి. బొమముడిపాటుజంకెనలు పోయినవి. కన్నులు మూసికొని పోయినవి. మణితధ్వనులు నిలిచిపోయినవి. నిశ్వాసము మంద మయినది. కుచములయుబ్బులాటము తీఱినది. అటుపైదశ మనోగోచరము కాదు.

స్విన్న మితి=(దం.) చెమర్చినది బింబము చంద్రునిది. జాఱిపోయినది పువ్వులసరముల మొత్తముచేత కట్టఁబడిన చీఁకటి. పూర్వమే ప్రకటముగానున్న (ముదురుచున్న) మొగలిపువ్వుయొక్క అగ్రముయొక్క రూపముకలదియైనది చక్కని చిఱునవ్వు. శమించినది కమ్మలయొక్క (కుండలములయొక్క) (ఆరభటీవృత్తిప్రధానమయిన పురుష) నాట్యము. కలువల జంట అడ్డముగా ముకుళించినది. పోయినది పగడముయొక్క సీత్కారము. పైని ఎఱుఁగను జూమా ఏమయినదో అని.

(తా.) (ప్రేయసికి) ముఖము చెమర్చినది. పూలసరములతో కట్టఁబడినకొప్పు వీడిపోయినది. చిఱునవ్వు ముదురుచున్న మొగలిరేకుకొనవలె అయినది. (మొగలిరేకు లేఁతలో మిక్కిలి తెల్లఁగానుండును. ముదిరిన కొలఁదియు చుట్టును ఓరను మొదట కొంచెముగాను పిమ్మట మఱికొంత తరువాత మఱియుం గొంతగా తెలుపెల్ల తగ్గిపోయి చిట్టచివరను రవంతధావళ్యము రేకుయొక్క మూలమందు మిగిలి పిమ్మట అదియును బోవును; తత్ప్రకారమే చిఱునవ్వుయొక్క ధవళకాంతి మొదట కొంతదూరము వ్యాపించి పిమ్మట అంతదూరము రాక అంతకన్న తగ్గి క్రమక్రమముగా మఱియు మఱియు సంకోచించి చివరకు అధరమందే నిలిచి పిమ్మట అందుఁగూడ అదృశ్యమైనది.) కుండలములయొక్క ఊఁగులాటలు శమించినవి. (కుండలములకు ఉద్ధతనాట్యమును చెప్పుటచేత పురుషాయితము సూచింపఁబడినది.) కన్నులు అడ్డముగా మూఁతపడినవి. ప్రియుఁడు నాటిమాటికి ముక్క

న నధరమును కఱచుటచే నయిన నొప్పికి కలుగుచున్న సీత్కారము నిలిచిపోయినది. అటుపైదశ మనోగోచరము గాదు.

అవనౌ=భూమియందు.

**55.** పు. ఘటాయామ్=త్రాసులో. సదసి=సభలో. తత్పరిభవ=అతని కవమానము. స్వ అవతంస కల్హార మకరన్దమ్=తన కొనచెవియలంకారమైన యెఱ్ఱగలువయందలి తేనెను. వామ కర నఖ అగ్రేణ=ఎడమ చేతి గోటి కొనతో. చిక్షేప=చిమ్మెను.

అహో ఇతి=(దం.) ఆహా! నా యదృష్టము! నాయొక్కయు భవభూతియొక్కయు వాక్కును (కవనమును) తులయందు నెట్టి, అగపడఁగా దానియందు (భవభూతివాక్కునందు) తేలిక (భవభూతి కవనమున రసము తక్కువయగుటచే ఆవైపు, తక్కెడ పైకి లేవఁగా), వాక్కులయొక్క దేవత (సరస్వతి) వెంటనే (తన) చెవియందున్న యెఱ్ఱగలువ మొగ్గయొక్క తేనెయొక్క మాధుర్యమును చల్లుచున్నది పూర్తికై భగవతి!

మనుతే స్మ= తలఁచెను. స్వైరిణీమ్= జారిణిని. సంకేతమ్=జార సంగమమునకు ఏర్పఱచుకొన్న చోటికి. చతురా= నేర్పరియైన.

త్వత్తోఽపీతి= (దం.) నీకన్నను క్రూరుఁడు ఓ రాజా (ఆ) చేసి (క్రూర) బాణములవాఁడు (మన్మథుఁడు) ఓ భూమియొక్క భర్తా (రాజదండన యైనను సహ్యముగాని, మదనబాధ సహ్యముగా దని భావము.), ఆజ్ఞను ఎవనియొక్క. (ఏమన్మథునియొక్క యాజ్ఞను) రుద్రాదులు దాసులవలె శిరస్సున వహించుచున్నారో. (మదనబాధను లోఁబడుట నాయందు తప్పుగా గ్రహింపఁగూడదు. త్రిలోచనుఁడు కూడ దానిని జయింపలేక పోయెను గదా, నావలన నగునా అని భావము.)

దోర్దణ్డాత్ = దండమువంటి బాహువునుండి. అఙ్గద=బాహుపురి.

మఞ్చక=మంచము. స్థూణా=నిట్రాడు. జలద ఆగమః = మేఘముల రాక (వర్షాకాలము). వత్సస్య=కుమారునియొక్క. ఘటికా = పడెత. పర్యాకులా=దుఃఖితురాలై. వధూమ్=కోడలిని. శ్వశ్రూః=అత్తగారు.

**56.** పు. శుక్తిద్వయేతి = (దం.) ముత్తెపుఁజిప్పలజంటయొక్క సంపుటము ఓ భోజరాజా కీర్తియను సముద్రములో నీయొక్క ఆకాశము; (ఆకాశము నీకీర్తి సముద్రములోని ముత్తెపుఁజిప్ప సుమా). తలంతును అందునుండి పుట్టువుగల ముత్తెమునుగా చంద్రబింబమును.

క్వణ యుతౌ=ధ్వనితో కూడినవి. క్షుభ్యత్ క్షీరధి దుగ్ధ ముగ్ధ మహసీ = కదలుచున్న పాలసముద్రముయొక్క పాలయొక్క సుందరమయిన కాంతికలవి. వాసనీ

=రెండువస్త్రములు. వికాసికా= ప్రకాశించునది. సు భాషిత కలా కౌశల్యమ్=మంచి పలుకులయొక్క విద్యయందు నేర్పు.

అఙ్క మితి= (దం.) మచ్చనుగా కొందఱు తలంచినారు, సముద్రముయొక్క బురదనుగా ఇతరులు తలఁచినారు, లేడినిగా కొందఱు చెప్పినారు, భూమియొక్క ప్రతిబింబమునుగా ఇచ్ఛగించినారు ఇతరులు; చంద్రునియందు ఏది పగులఁగొట్టఁబడిన యింద్రనీలముల ముక్కలవలె నల్లనిది మిక్కిలి యగపడుచున్నదో దానిని దట్టమయిన దానిని రాత్రి త్రాగఁబడిన కటికిచీఁకటిని కడుపులో నున్న దానినిగా (రాత్రులయందు త్రాఁగబడి కడుపులో పేరుకొనియున్న దట్టంపుఁగటికిచీఁకటినిగా) చెప్పుచున్నాము.

**57.** పు.— లక్ష్మీ రతి= (దం.) లక్ష్మియొక్క క్రీడాసరస్సు, తెల్లకాంతియొక్క యిల్లు, అద్దము దిక్కులనెడు స్త్రీలకు, పువ్వు రాత్రియను తీఁగకు, మూఁడులోకముల ను జయించువాఁడయిన మన్మథునియొక్క గొడుగు, ముద్దయాయిన శివుని నవ్వు, దేవనది (గంగ) యొక్క తెల్లదామర, (ఈ) చంద్రుఁడు వెన్నెలయను నమృతముయొక్క బావిని పుట్టించుచున్నాఁడు, సమూహము నక్షత్రములనెడు గుండ్లయొక్క (నక్షత్రములనెడి గుండ్లయొక్క మొత్తమయినవాఁడు.)

తర్క ఇతి= (దం.) తర్కవ్యాకరణ మార్గహితమయిన బుద్ధిగలవాఁడను కాను, సాహిత్య మెఱిగిన వాఁడను కాను, ఎఱుఁగను విచిత్రకావ్య నిర్మాణముయొక్క నేర్పును మిక్కిలి ఆశ్చర్యమగు దానిని; దేవత యొకానొకతె బ్రహ్మయను ప్రియునిచేత పొగడఁబడినట్టిది (తనచేత నున్న) వీణయొక్క మసృణ ధ్వనితో వేఱుకాని ధ్వనిగలుగునట్లుగా అట్లయినను ఏమో చెప్పమన్నది నోట నున్నదై నాయొక్క (తనవల్లభుఁడగు బ్రహ్మచే పొగడఁ బొందిన సరస్వతీదేవి నా నాలుకయందు నెలకొని తనచేతివీణయొక్క మధుర నాదమే యనునట్లుగా ఏమేమో పలుకుచున్నది.)

సులలితం ప్రబన్ధమ్=మనోహరమయిన రచనను.

మాతఙ్గీ మితి=(దం.)మాలదానిని బలె మాధుర్యమును (మనోహరపదగుంఫనను) వ్యఙ్గ్యార్థాతిశయముగల కావ్యముల నెఱిఁగినవారు స్పృశింపనే స్పృశింపరు ఉత్తమమయినదానిని (ధ్వన్యర్థపరాయణులు ఉత్తమమయిన మాధుర్యమును సరకుసేయరు); వ్యుత్పత్తిని (పాణ్డిత్యమును) కులకన్యకనుబలె (శృంగారాది) రసములచేత నున్మత్తులయినవారు చూడరు వీరు. కస్తూరీ కర్పూరముల పరిమళములకు చెలి (యయిన) వ్యుత్పత్తి మాధుర్యముల కూడిక చెవికి మధురౌషధము ధన్యునికి ఎవని కో కలుగును.

విర ళేతి=(దం.) దూరదూరముగానున్నవి పెద్ద నక్షత్రములు కలియుగమందుఁ బోలె సత్పురుషులు (కలియందు సజ్జను లెట్లు అరుదుగానున్నారో అట్లే పెద్దనక్షత్ర

ములు మాత్రము కొన్ని అక్కడక్కడ అగపడుచున్నవి). మనస్సువలె మునియొక్క అన్నిచోట్లను స్వచ్ఛ మాయెను ఆకాశము (ఆకాశము మునిమనస్సువలె అన్ని చోట్లను స్వచ్ఛ మాయెను). తొలఁగిపోవుచున్నది చీఁకటి (అజ్ఞానము) మనస్సునుండి సత్పురుషులయొక్కయుం బోలె దూరమునకు (సజ్జనుల హృదయమునుండి యజ్ఞానమెట్లు తొలఁగునో అట్లు చీఁకటి తొలఁగుచున్నది). పోవుచున్నది రాత్రి త్వరగా సిరి ఉద్యోగహీనులయొక్కపోలె (నిరుద్యోగుల సిరివలె రాత్రి త్వరగా క్షయించుచున్నది).

**58.** పు. అభూదితి=(దం.) ఆయెను పచ్చనిదిగా తూర్పు పాదరసమువలె భక్షించి బంగారమును (బంగారమును గ్రసించిన పాదరసమువలె తూర్పు పచ్చఁబాటినది). పోయిన కాంతిగలవాఁడు చంద్రుఁడు పండితుఁడుపోలె మూర్ఖుల సభలో (మూర్ఖులనడుమ తగులుకొని వారిని రంజింపలేక వారిచే పరిహసితుఁడై వెలవెలఁబోవుచున్న పండితునివలె చంద్రుఁడు శోభాహీనుఁ డాయెను). క్షణములో క్షయించినవి నక్షత్రములు రాజులవలె ప్రయత్నాసక్తులుకాని. ప్రయత్నహీను లయిన రాజులవలె నక్షత్రములు క్షణములో క్షీణించినవి). దీపములు వెలుఁగుట లేదు వినయహీనులయొక్క పోలె సుగుణములు.

మాలాకార పత్నీ=పువ్వులసగములుచేయు (గ్రుచ్చు) వానిభార్య.

సమున్న తేతి= (దం.) మిక్కిలియున్నతమయిన దట్టమయిన చను గుబ్బలను ముద్దుగొనుచున్న ఆనపకాయ (బుఱ్ఱ) చేత ధ్వనించుచున్న మధురమయిన వీణగలదైన దేవ లోకముయొక్క చంచలమయిన కనుబొమలుగలదానిచేత (సుందరిచేత) నీది పాడఁబడుచున్నది శివుని కిరీటపుఁగొనను ప్రకాశించు మంచు కిరణములవాని (చంద్రుని) మొలకయొక్క కిరణముల ప్రవాహమువలె తెల్లని కీర్తి. (నీకీర్తి స్వర్గమున కూడ వ్యాపించినది అని తా.)

ఉలూఖల పరాయణామ్=ఱోటియందు ఆసక్తురాలిని (ఱోటిలో ఏమో దంపుచున్నదానిని). ముసలమ్=రోఁకటిని. కాష్ఠమ్=కొయ్య.

**59.** పు.—జగతీతి=(దం.) లోకములో తెలిసినదే ఇది, కొయ్యవే అగుదువు నిజముగా; అది యును గదా సత్యము అడవిలో పెంపఁబడినదానవు; క్రొత్త కలువలవంటి కన్నుల దానియొక్క చేతితోడి కూడికయను పండువునందు దీనియందు, ఓరోఁకలీ చిగురు నీకు తత్క్షణమే ఏల పుట్టలేదో. (నీవు మహాజడపదార్థమవు, ఆసుందరిచేతి స్పర్శయొక్క స్వారస్యము నీ కెట్లు తెలియును? రసికునికే ఆపాణిసంగము కలిగినయెడల అతనిదేహము చిగిర్చియే యుండును అని భావము.)

ఛన్న మితి=(దం.) కప్పఁబడినదానిని సైన్యముయొక్క ధూళియొక్క భాగము చేత నీయొక్క శ్రీమంతుఁడవయిన భోజరాజా భూమియొక్క పరిపాలనయందు నేర్పు

గలవాఁడా దక్షిణదేశపు రాజు చూచి అంతరిక్షమును (ఓ, భోజరాజా నీసేనాధూళిచే ఆవరింపఁబడిన యాకాశమును దక్షిణఖండపురాజు చూచి) క్షణములో సందేహములేని వాఁడై అవమానములేనివాఁడై సేవకులులేనివాఁడై బంధువులులేనివాఁడై స్నేహితులులేని వాఁడై భార్యలులేనివాఁడై పిల్లలులేనివాఁడై తమ్ములులేనివాఁడై బంగారములేనివాఁడై వెడలిపోయెను. (భోజునిదాడికి అడలి దక్షిణదేశపురాజు సర్వమును వదలి పాఱి పోయెను.)

అకా ల్లేతి=(దం.) అకాలమందు ధరింపఁబడిన మానససరస్సునకైన (ప్రయాణ) ప్రయత్నముయొక్క సంతోషముగలవైన (...సంతోషమును ధరించినవైన) హంసల చేతను, అకాలమందలి వృథ తాండవముగల నెమళ్ల సమూహముచేతను, దిక్కులు చూడఁ బడినవి వీరావేశముతో భరింప శక్యముకాకుండ నడచుచున్నదైన నీ గొప్ప సేనచేత రేఁపఁ బడిన భూమియొక్క ధూళిచేత నల్లనివి. (నీసేన నడవఁగా రేఁగినదుమారముచే చీఁకట్లు గ్రమ్మిన దిక్కులను అంతటను చూచి, మేఘావరణ మని తలఁచి, హంసలు మానససరస్సునకు ప్రయాణమైనవి, నెమళ్లు ఆడసాగినవి.—హంసలు వర్షాకాలములో మానససరస్సునకు పోవు ననియు, మేఘమును చూచి నెమ ళ్లాడు ననియు, కవిసమయములు.)

రట న్తమ్=కటువుగా అఱచుచున్న. కూజ న్తమ్=కూయుచున్న.

నో చారూ ఇతి=(దం.) కావు అందమయినవి కాళ్లు, కాదు మఱియు అందమ యినది ముక్కు, కాదు చెప్పఁదగినది మాట, కాదు విలాసముచేత చతురమయినది నడక, కాదు తెల్లనిది ఱెక్కలస్వీకారము ఇది నీయొక్క (నీయొక్క యీ ఱెక్కలును తెల్లనివి గావు); పరుషమయిన క్రేంకారధ్వనిచేత భరింపశక్యముగాని వాక్కును ఈచోట వృథా గానే పలుకుచు మూర్ఖమవయిన ఓకాకీ సిగ్గయిన పడవు(నీవు) తగని పాండిత్యమును మిక్కిలి యభినయించుచు.

గర్హాణమ్=నిందనుగా.

తు ల్యేతి= (దం.) సమాన వర్ణపు ఱెక్కలుగలవైన (కోకిలలకు విశేషణము.) నల్లనిది (కాకికి వి.) కోకిలతోకూడ చేరినది (కాకికి వి.) ఎవనిచేత చెప్పఁబడును కాకి స్వ యముగానే మాటలాడని యెడల? (కాకియు నలుపు. కోకిలయు నలుపు. రెండును కూడియున్నప్పుడు కాకి కట్టని కూయనియెడల అది కాకి యని తెలియదు. మాసాంగత్య ము చేత నిన్ను మహాకవి యని తలంతురు, నీమాటచేత నే నీవు కవివి కా వని తెలియఁబ డుచుకొంటివి, అని భావము.)

60. పు. మిథః=పరస్పరము.

క్షితిరుహామ్=చెట్లయొక్క. శిశిర=చల్లని, సరితామ్=నదులయొక్క.

యత్రేతి=(దం.) ఎక్కడ నీరు అమృతమును నిందించునో (అమృతముకన్న శ్రేష్ఠమో), చండాలురు ఇంద్రుని (నిందింతురో- నూఱుయజ్ఞములు చేసినయింద్రునికన్న పుణ్యాత్ములో), చింతామణిని రాలు (నిందించునో-చింతామణికన్న పావనములో), అక్కడ మా యునికి ఓరాజా.

నివాస ఇతి=(దం.) ఉనికిపట్టు ఎక్కడ ఇప్పుడు మాకు? దానము చేయఁబడినది భోజునిచేత బంగారపుఁ బర్వతము (మేరువు) ; అని దేవతలు వ్యాకుల చిత్తము గలవారు (అని) భోజరాజా వార్త క్రొత్తది.

61. పు. సారఙ్గా ఇతి=(దం.) (ఏసిద్ధయోగులకు) లేళ్లు చెలికాండ్రు, ఇల్లు కొండగుహ, శమమే ప్రియ భార్య, జీవనము అడవి తీఁగలయొక్క ఫలములచేత, వస్త్రము ఉత్తమమయినది చెట్లయొక్క పట్టలు,—మంచిమాటలనెడి యమృత ప్రవాహమందు మునిఁగిన మనస్సుగల యెవరికి (ఏశివయోగులకు) ఈసౌఖ్యము (కలదో); వారికి చంద్రకళాశేఖరుని (శివుని) యొక్క యతులమయిన మోక్షమందు కూడ మాకు ఆశ లేదు (అట్టిశివయోగులమయిన మాకు మోక్షమందు సయితము ఆశ లేదు).

తీర్థేషు=తీర్థములకు. తీర్థం భోజ పరం హి సః= భోజరాజా అతఁడే ఉత్తమతీర్థము సుమా.

మేరా వితి=(దం.) మేరువునందు, మందరపర్వత గుహాలయందు, హిమవంతముయొక్క చఱియయందు, మహేన్ద్ర పర్వతమందు కైలాసముయొక్క రాల మీఁదను, మలయపర్వతముయొక్క శిఖరముల ప్రదేశములయందును, సహ్య (అద్రౌ=) పర్వతమందుఁ గూడ ఆ యాచోట్ల తఱుచుగా ఓభోజరాజా వినఁబడినది నీది నాచేత చక్రవాళమందు సంచరించెడు చారణ సమూహముచేత బిగ్గరగా పాడఁబడుచున్న కీర్తి (ఓ భోజరాజా నీకీర్తిని చక్రవాళ సంచారులగు చారణులు గుములుగాఁగూడి బిగ్గరగా పాడుచున్నారు, ఆపాట నాకు వినఁబడుచున్నది).

నాద్రియతే=ఆదరింపఁడు. సావజ్ఞమ్=తిరస్కారముతో. సముదితః=చక్కఁగా చెప్పఁబడినది.

అల్లాళక్షోణిపా లేతి= (దం.) అల్లాళరాజా, నీశత్రువుయొక్క పట్టణములో తిరుగుచున్నదై-బోయది- (అక్కడక్కడ) పడియున్నవానిని గ్రహించి రత్నములను మిక్కిలిగొప్ప చంద్రుడ నిప్పుకలనెడు భ్రమచే ఆకులమయిన యంతరంగము (మనస్సు) గలదై-వేసి చందనపు ముక్కలను వానిపైని (ఆరత్నములపై)-మూఁతపడిన కన్నులుగలదై ఊఁదుచున్నదై ఊర్పులయొక్క పరిమళమునకై వచ్చిన తుమ్మెదల గుంపులచేత పొగయనెడుభ్రమను వహించుచున్నది.

(అల్లాళరాజుయొక్క ప్రతాపమునను భయపడి అతని శత్రురాజు అడవిఁబట్టఁగా వానిరాజధాని పాడై అడవి కాఁగా, అందు కిరాతులు చేరి నివసించియుండఁగా, అట కూలి పడిపోయిన రత్నఖచితములైన గోడల పెద్దపెద్దరత్నములు అక్కడక్కడ పడి యుండఁగా, వంటకు నిప్పు సంపాదించుటకై ఎక్కడ నయిన కార్చిచ్చుండునా యని వెదకుచు వచ్చినయొకకిరాతి ముగ్ధ యగుటచేత ఈపడియున్న దేదీప్యమాన రత్నములను అడవులలో సహజముగానే యుండెడుకార్చియొక్క పెద్దపెద్ద చంద్రనిప్పుకలని తలంచి వానిని పిడకమీఁద పెట్టి ఆ నిప్పుని నలిగా - పొడుపడిన యాపట్టణపుటింట్లకలపయొక్క చందనపుముక్కలను అక్కడక్కడ పడి యున్న వానిని-వేసి ఊఁద సాగినది. అంతట తనశ్వాసపరిమళమునకు ముఖముమీఁద తుమ్మెదలు మూఁగఁగా వానిని నిప్పు రాజి బయలుదేఱినపొగ యని తలఁచి, ఆపొగ తనకన్నులలో చొరకుండునట్లు కన్నులు మూసికొని మంటకొఱకు ఊఁదుచున్నది.—అని అర్థము. అల్లాళరాజు మహాప్రతాపశాలి, ఎంతటిమైశ్వర్యవంతులయిన శత్రురాజులును ఈయనప్రతాపమునను నిలువలేక తమరాజ్యములు పాడుపెట్టి నామరూపములు లేక పోయినారు, అని తా.)

ఏణీదృశామ్=ఆఁడులేడియొక్క కన్నులవంటి కన్నులుగల స్త్రీలయొక్క.

అపాఙ్గేత్యాది.—అపదేశపూర్వైః=వ్యాజపూర్వకములయిన. అపాఙ్గపాతైః=కటాక్షములయొక్క ప్రసారములచేత. యువానః=యౌవనవంతులు. శృఙ్ఖలితాః=సంకెళ్లు వేయఁబడినారు. (మేడలనుండి స్త్రీలు వీథిని పోవుచున్న పురుషులను క్రేగంటి చూచిన మాత్రముననే ఆపురుషులు వారిని మోహించి నిలిచినచోటనే నిశ్చేష్టులై యుండు రేగాని అవతలికి మఱి యడుగు పెట్టనేరరని యర్థము. ఆపట్టణపుస్త్రీలు మహాసుందరాంగులు ను జాణలు నని తా.)

అమ్భోజేతి.—ఇహ=ఈయేకశిలానగరమందు, అమ్భోధి దీర్ఘాసు=సముద్రమువలె విశాలములైన, దీర్ఘికాసు=దిగుడుబావులయందు, సమాగతానామ్=వచ్చునట్టి, అమ్భోజ పత్త్ర ఆయత లోచనానామ్=కమల దళములవంటి విశాల నేత్రములుగల స్త్రీల, కుటిలైః=వక్రములయిన, అపాఙ్గైః=క్రేగంటి చూపులనెడు, అనఙ్గబాణైః=మన్మథబాణములచేత, యువానః=కోడెకాండ్రు, ప్రహతాః=కొట్టఁబడినారు.

కుముదేతి= (దం.) తెల్లగలువల సమూహము తొలఁగిన సిరి గలది (శోభాహీనము) (అయినది), శ్రీగలది (ఆయెను) కములముల (షణ్డమ్=) సమూహము, వదలుచున్నది (ముదమ్=) సంతోషమును గ్లానిచే, సంతోషముగలది (అగుచున్నది) చక్రవాకము, ఉదయమును (పొడుచుటను, అభ్యుదయమును) సూర్యుఁడు పొందుచున్నాఁడు, చంద్రుఁడు అస్తమును (క్రుంకుటను, నాశనమును) (పొందుచున్నాఁడు); పాపుపిధ

యొక్క క్రీడలకు అన్యోన్య విచిత్రముగానున్నది పరిణామము! (ఇది ప్రాతఃకాలవర్ణనము. ఎట్టివారికిని కలిమిలేములు అనియతము లనియు కనుక నేను మహైశ్వర్యసంపన్నుఁడనై యుండినతనకు ఇప్పుడు లేమి వచ్చిన దనియు, తా.)

శారద చన్ద్ర కిరణ గౌరాణ్=శరత్కాల చంద్రుని కిరణములవలె తెల్లని. ఆశావ్యేతి= (దం.) ఓదాతా పర్వతముల సమూహమును సూర్యుని వేఁడిచేత కాల్పఁబడినదానిని, (ఉద్దామ=)ఉగ్రమయిన కార్చిచ్చుచేత పాడయిన యడవులను కూడ, అనేకములయిన నదుల (తూర్పునకు పాఱెడు నేళ్లి) యొక్కయు నదముల (పడమటికి పాఱెడు నేళ్లి) యొక్కయు మూర్గను కూడ నిండించి, రిక్తుఁడవై తివనుట యేదో (యేది కలదో) ఓమేఘుఁడా అదే నీకు ఉత్కృష్టమయిన సిరి. (ఎల్లవారికిని త్యాగము చేసి దరిద్రుఁడ వయినాఁడవు, మాఘపండితా, అదే నీగొప్ప అని తా.)

రతిమ్=కోరికను. దుర్లలితమ్=దుష్టమయిన. ప్రాణాః= ఓప్రాణములారా. ప్రజత =పొండి. పరిదేవనేన కిమ్= దుఃఖించి ఏమిఫలము....అనల=నిప్పుయొక్క. విఘాత అన్తర్ దాహః=భంగపెట్టుట వలని లోపలి మంట...అర్థిభిర్ వ్రజత=యాచకులతో పొండి. పశ్చాదితి=(దం.) పిమ్మట నైనను పోవలసినదే, ఎక్కడిది సోబత్తు మఱి యిట్టిది?...

విలపన్=ఏడ్చుచు. అగాత్=పోయెను.... భూభుజః=రాజులు. స్వభార్యా సహాయః=తన భార్య తోడుగాఁ గలవాఁడై. మ్రియతే= చచ్చిపోవుచున్నాఁడు....విపన్నమ్=చచ్చినవానినిగా.

ఫలే విసంవాదీ=ఫలమందు విపరీతము (అగును.) హిత్వా=వదలి. భవత్ గిరః =నీ వాక్కునకు. పలాశే=మోదుగుచెట్టున. తం భూపాలమ్ ఆపృచ్ఛ్య=ఆరాజునొద్ద సెలవుపుచ్చుకొని.

ఆరనాళ= (దం.) తరవాణియొక్క గొంతులో కాల్చుటయొక్క భయముచే (తాను నాకంఠములో నున్నయెడల తన్ను నేను త్రాగెడు తరవాణి కాల్చునని భయపడినదై) నా నోటినుండి లేచిపోయినది సరస్వతి. అందుచేత శత్రువుల లక్ష్మియొక్క కొప్పును పట్టుకొనుటయందు ఆసక్తమయిన చేయిగలవాఁడా లేదు కవనము నాకు.

తా.—నేను మిక్కిలి పేదవాఁడను, మంచిభోజనము లేక తరవాణి నీళ్లచేత కాలము గడపుచున్నాను. విశేషపండితుఁడను, కాను నీవిద్వత్సభను చూడఁగా సభాకంపము గలిగి అంతకు ముందు ఊహించుకొని వచ్చిన కవనమును కూడ మఱచినాఁడను నీవు శత్రువులను జయించి వారిసిరినెల్ల గ్రహించి మహైశ్వర్య సంపన్నుఁడ వయి యున్నావు, నా కేమయిన దయచేసి నాదారిద్ర్యమును తీర్పవలయును.

మహిషీ శతమ్=నూఱుగేదెలను. (గేదెలను ఇచ్చుటయందు ఇఁకమీఁద తర వాణి త్రాఁగ నక్కఱలేదు, సమృద్ధిగా గేదెపెఱుఁగు త్రాఁగుచు సుఖముగా జీవింపుము, అని భోజుని యభిప్రాయము).

అనుషజ్గీ=సంబంధించినది.

కచభారా దితి=(దం.) కొప్పుబరువునకు స్తనభారము (భయపడుచున్నది), స్తన భారమునకు భయపడుచున్నది కచభారము, కచకుచముల భారమునకు పిఱుఁదులు భయ పడుచున్నవి. ఏమి యిది చంద్రముఖీ చమత్కారము? కచకుచజఘనములు ఒకదానికన్న నొకటి గొప్పవిగా నున్నవని తా. మఱియు విషయనిగరణముచేత రాత్రికి చక్రవాకము లు భయపడెను, ఏనుఁగుకుంభములకు నాచు భయపడెను, మేఘమును కొండలను చూచి వర్షము కురియు ననియు సెలయేళ్లు వెల్లువలు పాఱు ననియు ఆవెల్లువలు తన్ను కోసివేయు ననియు తలఁచి యిసుకతిన్నెయు, భయపడెను.—అని యర్థము.

వదనా దితి=(విషయనిగరణముచేత) చంద్రునికి కమలములును, చిలుకలకు దొండ పండును దాడిమగింజలపజ్త్తియు, రాత్రికి చక్రవాకములును, లేడి సింహమునకును, భయ పడుచున్నవి—అని యర్థము.

స్వ అఙ్కే శయానమ్=తన తొడమీఁద నిద్రించుచున్న. వైశ్వానరమ్=అగ్ని దేవుని. యదృచ్ఛయా=స్వేచ్ఛగా, తనంతట.

హుతాశనః=అగ్ని. పావకే=నిప్పులో. చన్దన పఙ్కశీతలః=గంధపు ద్రవము వలె చల్లనివాఁడు. ఘర్మ=గ్రీష్మ=వేసవి.

మరు దితి=(దం.) గాలియొక్క రాకయొక్క వార్తచేత సయితము హీనమై యుండఁగా కాలము (గాలి బొత్తిగా లేనప్పుడు), మేలుకొని (=దుస్సహమై) యుం డఁగా మిక్కిలి ప్రబలిన యుష్మదము.

ఉర గీతి=(దం.) ఆఁడుఁబాము శిశువునకు ఆఁకలిగొన్నదానికి తన దానిని పె ట్టెను ఘూత్కారమును (బుసను) ముఖవాయువుచేత. (పాములు గాలిని తిని బ్రదుకునవి కాఁబట్టి గాలి లేనందున తల్లిపాము శిశువునకు తనఘూత్కారవాయువును మేపెను.)

అబలా స్వితి= (దం.) సుకుమారస్త్రీలయందు విలాసవంతులు అనుభవించిరి నేత్రములచేత నే క్రొత్త (ఉపగూహనాని=) యాలింగనములను (దర్శనానందము నను భవించిరే గాని స్పర్శానందము ననుభవింపరైర).

ఆర్తః=బడలినవాఁడై. నిబిడ=దట్టమయిన. జమ్బ్వా=నేరేడు. కపిభిః= కోఁతులచేత.

హస్త విస్ఫాలనేన=చేతి చప్పట్లచేత. తారం రారటీతి స్మ=గట్టిగా మాటిమాటికి అఱచినది. ఉరసి=ఱొమ్ముమీఁద. అయే మాతః=అయ్యో అమ్మా! చక్రన్ద=ఏడ్చెను. అస్తగ్రాహః=దాఁగినవాఁడై (ఘూఁటు వేసుకొని). పేటికామ్=పెట్టెను. వాహయిత్వా=మోయించి (పట్టించుకొని). ఆత్మానం గోపాయిత్వా=ప్రచ్ఛన్నముగా. గ్రాహేణామ్=మొసళ్లకు. శూల అగ్ర అర్పితేన=కొఱ్ఱయొక్క కొనను ఎక్కింపఁబడిన (కొఱుత వేయఁబడిన). రుతాత్=కూఁతవలన. తరతి=దాఁటును.

కన్దుక లీలా=బంతి యాట....ప్రమదా...ఇవ=సుందరియొక్క యధరోష్ఠమును చుంబించుటకు ఆశగలదాని వలె. తామరస=తామరపువ్వు. ఉత్పతసి=ఎగురుచున్నావు. రాగ=ఎఱుపు....నఖ శ్రేణీ=కాలి గోళ్ల (అంశు=) కిరణములచేత తెల్లతెల్లగాను, అంతరాళమున నున్నదై కన్నుల కిరణములచేత నల్లనల్లగాను.

పయోధర ఇతి=(దం.) కుచముల ఆకారమును ధరించిన దగుటచే బంతి చేతితో కోపముతో కొట్టఁబడుచున్నది మాటిమాటికి; ఇట్లనియుం బోలె కంటియాకారముకలది (కనుకనే) భయపడిన (కొనచెవియందలి) కలువ స్త్రీయొక్క దయకై పడెను పాదములతో.

అనేకేతి=(తా.) ఎందఱో రాజులు కలరు దుర్బలులను కొట్టి వారిసిరిని హరించువారు. ఓ భోజరాజా! నీవొకఁడవే కలవు లోకము నంతయు పాలింప సమర్థుఁడవు.

హేమన్తకాలే=చలికాలములో. జ్వలన్తీం హసన్తీం సంసేవమానః=మండుచున్న కుంపటిని కాఁచుకొనుచు.

కవిమతి రితి=(దం.) కవియొక్క బుద్ధి వలె (బహుల=) విస్తారమయిన యూహలుకలదై (విస్తారమయిన లోహముగలదై), చకముఁగా కూర్పఁబడిన చక్రవాకములుగలదై (చక్రములు గలదై) ప్రాతః కాలము వలె, శివుని యాకృతి వలె కుంపటి (నవ్వుచున్నదై) ప్రకాశించుచున్నది (విధు—ఉమా—అనల=) చంద్రుఁడు పార్వతి నిప్పు (అను) వీనితో (విధూమ అనల=పొగలేని నిప్పుతో) కూడుకొన్నదై.

ద్యూత పణ జయ=జూదముయొక్క పందెముయొక్క గెలుపుచేత. అగ్రమహిష్యామ్=పెద్దరాణియందు. దాక్షిణ్య=దయా. విశేష అనవధారణేన=విశేషముయొక్క అనిశ్చయముచేత. కృత ఆహ్నికః=చేయఁబడిన ప్రాతరనుష్ఠానముకలవాఁడై. త్ర్యక్షర ఊన తురీయ చరణామ్=మూఁడక్షరములచేత (—ములు) తక్కువయైన నాలవపాదము గలదానిని.

స్నాతేతి=(దం.) స్నానముచేసినదై యున్నది కుంతలేశ పుత్త్రీ, వంతు అంగరాజుయొక్క చెల్లెలికి, జూదములో రాత్రి యిది (ఈరాత్రి) జయింపఁబడినది కమల

చేత, దేవియొక్క కోపమును తీర్పవలసియున్నది ఇప్పుడు, అని అంతఃపుర సుందరీ జనముయొక్క గుణమునందు తక్కువ యెక్కువలు ఆలోచించుచు నీవు (అప్రతిపత్తి=) నిర్ణయము తోఁపమిచే మూఢమయిన మనస్సుగలవాఁడవై రెండుమూఁడు ఉంటివి గడియలు.

విద గ్ధేతి=(దం.) చక్కఁగా కాల్పఁబడినదియు (నేర్పరియు), అందమైన నోరుకలదియు (ముఖముకలవాఁడును) ఎఱ్ఱనిదియు (అనురాగము కలవాఁడును) పిఱుఁదుపైని ఉన్నదియు (ఉన్నవాఁడును) కాముకురాలిచేత కౌఁగిలింపఁబడిన సుందరమయిన మెడగల (కుండ) యందు (ప్రియునియందు) ధ్వని మణితమువంటిది.

ప్రహదే=మడుగులో. జాలకైః = జాలారివాండ్రచేత. జతు=లక్క. ఆనుపూర్వ్యాత్=వరుసగా.

అయి ఖలు జన్మసు పురాకృతానాం కర్మణాం విపాకః విషమో హి భవతి=అయ్యో నిశ్చయముగా ప్రాణులకు పూర్వకృత కర్మలయొక్క పరిణామము క్రూరము గదా అగును.

క్వ న్విత=(దం.) ఎక్కడి కులము నిష్కళంకమయినది విశాలనేత్రయొక్క (సీతయొక్క పవిత్రవంశమెక్కడ), ఎక్కడను రాక్షసునితోడి సంగముముయొక్క (సంగముము కలిగె నదను) అపనింద? (అసంభావ్య మని భావము.)

ధ్వనిదోషం మన్వానః=అభిప్రాయ దోషము (అభిప్రాయము పరుషముగా నున్నదని) తలఁచుచున్నవాఁడై.

క్వ జన కేతి= (దం.) ఎక్కడి జనకుని కూఁతురు, ఎక్కడి రాముని భార్య, ఎక్కడను పదిమెడలవాని యింట నివాసము?

శివశిర సీతి= (దం.) శివుని తలమీఁద తలలు ఏవి ప్రకాశించినవో శివశివా (అయ్యయ్యో)! ఆతలలు దొర్లుచున్నవి గద్దల కాళ్ల చేత! (తనతలలను ఖండించి వానితో పుష్పములతోనుంబోలె శివుని పూజించిన రావణాసురునియాతలలను ఆతనిసంహార మయినతర్వాత గద్దలు మాంసమునిమిత్తము దొర్లించి శోధించుచున్న వని యర్థము.)

ఉచ్చాటనాయ=తరుముటకై. యతతే స్మ=యత్నముచేసెను. శేతే స్మ=శయనించెను....తత్ హృదయ గతమ్=బ్రహ్మరాక్షసుని మనస్సు లోనిది. పాణినిసూత్రమ్=పాణినిమహర్షి కృతవ్యాకరణసూత్రమును.

సర్వస్య ద్వే=(సూ.) అన్నిపదములను రెండు మాఱులు ఉచ్చారణ గలుగును: ఉ. ఇల్లిల్లు తిరిగెను, ఊఱూఱు చాటెను.

సర్వ స్యేతి=(దం.) అందఱకును రెండు-మంచిబుద్ధి, చెడ్డబుద్ధి, సంపదకు, ఆపదకు హేతువులు.

వృద్ధోయూనా...=(సూ.) యూనా సహోక్తౌ గోత్రం శిష్యతే...ఉ. గార్గ్యశ్చ గార్గాయణ శ్చ గార్గ్యౌ.

వృద్ధో యూ నేతి=(దం.) ముసలివాఁడు వయసువానితో కూడ స్నేహముచేత విడువఁబడుచున్నాఁడు కాముకురాండ్రచేత. (వయసుచెలువుఁడు దొరకినయెడల కాముకురాండ్రు ముసలిగాని విడుతురు.)

ఏకో గోత్రే=(సూ.) 'అపత్యం పౌత్రప్రభృతి గోత్రమ్' అనుసూత్రమువలనఁ పౌత్రుఁడు మొదలగాఁగల వంశ్యునికి గోత్ర మని పేరు. అట్టి గోత్ర మర్థ మగునప్పుడు (ఎన్నవతరమువాఁడు అర్థ మయినను) (ప్రకృతిశబ్దముపై) ఒకటియే ప్రత్యయము వచ్చును. ఉ:—ఉపగుని గోత్రాపత్యము (ఉపగునికి ఎన్నవతరమువాఁ డయినను) ఔపగవుఁడు.

ఏకో గోత్ర ఇతి=(దం.) ఒక్కఁడు వంశమునందు జన్మించును పురుషుఁడు ఎవఁడు కుటుంబమును భరించుచూ. (కుటుంబములో ఆర్జకుఁడొకఁడే, భోజనము చేయువారు అనేకులు.)

స్త్రీ పుంవ చ్చ=(సూ). యూనా సహోక్తౌ వృద్ధా స్త్రీ శిష్యతే, తదర్థ శ్చ పుంవత్: ఉ. గార్గీ చ గార్గ్యాయణశ్చ గర్గాః.

స్త్రీ పుంవ చ్చే తి=(దం.) స్త్రీ పురుషునివలె స్వతంత్రముగా వ్యవహారము చేయుచూ (ఏ) యింట, అది నిశ్చయముగా ఇల్లు పాడు.

నాగః=ఏనుఁగు. శర్వరీ=రాత్రి. జవేన=వేగముచేత. మిథునైః=దంపతులచేత. వసుమతీ=భూమి.

అ మ్బేతి=(దం.) తల్లి కోపగించుచున్నది, నామూలముగాఁ గాదు నాభార్యమూలముగాఁ గాదు; నాభార్యయు కోపగించుచున్నది, తల్లివలనఁ గాదు నావలనఁ గాదు; నేనును కోపగించుచున్నాను, తల్లివలనఁ గాదు భార్యవలనఁ గాదు; చెప్పుము రాజా ఎవరి దోషము ఇది.

రాజ న్నితి=(దం.) రాజా ద్వారపాలకునివలన నే పొందినవాఁడను అయితిని ఏనుఁగును (నివారణమును); మదపుటేనుఁగును (మద మణఁచుటను) కోరుచున్నాను నీవలననుండి నేను భూమీశ్వరా.

ప్రాక్=తూర్పు. పరావృత్య=త్రిప్పి. శిక్షితా=నేర్పఁబడినది.

మార్గ ణేతి=(ద.) బాణములయొక్క (యాచకులయొక్క) సమూహము (నీదగ్గఱకు) వచ్చుచున్నది. అల్లెత్రాడు (కీర్తి) పోవుచున్నది అన్యదిక్కునకు. (సామాన్యధను

ర్విద్యలో బాణము దూరముగా పోవును, అల్లెత్రాడు చెవియొద్దికి వచ్చును, భోజునిధనుర్వి ద్యయందు అది విపరీతము, అని చమత్కారము. యాచకులు భోజునియొద్దకు వత్తురు, భోజునికీర్తి దిగంతములకు పోవును అని తా.)

ప్రత్యక్=పడమర. మృషా=అసత్యము. ఉదక్=ఉత్తరము. సర్వదః=సర్వము ను ఇచ్చువాఁడు. మిథ్యా=అబద్ధము.

నారయ ఇతి=(తా.) శత్రువులు నీవీఁపును పొందలేదు (=నీవు యుద్ధములలో వెన్ను చూపలేదు) నీహృదయమును పరస్త్రీలు పొందలేదు (=సత్పురుషుఁడవు పర స్త్రీకాముకుఁడవు గావు.)

౮౭. పుట.—చతుష్టయమ్ = నాలిగింటిని. మూల్యేన=వెలకు. భుజ్క్ష్వ=అనుభ వింపుము.

తపనే లలాటంతపే దూనదేహః=సూర్యుఁడు నొసటిని కాల్చువాఁడై యుండఁగా తపింపఁబడిన దేహముగలవాఁడై. పిపాసా=దప్పిచేత. నికట తట భువమ్ అటన్=సమీ పమందలి (చెఱువు) గట్టుయొక్క ప్రదేశమునకు తిరుగుచు. గోప=గొల్ల. మనోజ్ఞ=మ నోహరమయిన. తక్రమ్=మజ్జిగను. పేయం చేత్=త్రాగఁదగిన దైనయెడల.

హీర మేతి=(దం.) మంచు మల్లెపువ్వు చంద్రుఁడు అనెడి వీనికాంతివంటి కాంతి గలది, శంఖమువంటిది, (వ్యాతి కిబచులుగా ప్రభ యనుపాఠమందు—ప్ర=ప్రకృష్ట=గొప్ప— భ=నక్షత్రములు అని యర్థము.) చక్కఁగా పండిన వెలగపండువలె పరిమళవంతమైన రుచికలది, జవరాలియొక్క చేతులచేత మిక్కిలిచిలుకఁబడినదైన (యీ) మజ్జిగను త్రా గుము ఓ రాజా సకల రోగములను హరించుదానిని.

సుభ్రు=చక్కని కనుబొమలుకలదానా. ఆవిష్కృత=ప్రకటిత.

ఇన్దు మితి=(దం.) చంద్రుని కలువతీఁగ వలె, చక్రవాక సమూహము వలె కమ లలతయొక్క ప్రియుని (సూర్యుని చక్రవాక సమూహమువలె), మేఘమును చాతక స మూహము వలె, తుమ్మెదల గుంపు వలె పువ్వుల సమూహమును, మామిడిచెట్టును ఆఁడు కోకిల వలె, స్త్రీవలె తిపథగ్గను దేశాంతరముపోయినవానిని, మనోవృత్తి యిది సర్వదా రాజశ్రేష్ఠుఁడా నిన్ను చూచుటకు మిక్కిలి కోరుచున్నది.

మదిరాక్ష్యాః= (చూచువారికి) కామోన్మాదమును కలిగించునట్టి నేత్రములుగల స్త్రీయొక్క (సుందరియొక్క). సోపాః=మెట్లయొక్క.

రాజాభిషే కేతి=రాజుయొక్క స్నానమందు మదనోన్మాదపరవశయయిన గుబ్బె తయొక్క చేతినుండి జాఱిన బంగారు కలశము,

ఆరక్షకైః=తలవరులచేత. కుమ్భిలకేన=దొంగచే. ఖాతపాత=కన్నము వేయుట.

భ బ్భావళ్యామ్ అ_స్తకః సన్నివిష్టః= భ భా భి భీ అనువరుస యందు యమధర్మరాజు ప్రవేశించినాఁడు. (భకారగుణితమున వరుసగా వచ్చునక్షరములు ఎవరెవరిపేరికి మొదటివగునో వారి నందఱను వరుసగా చంపుచున్నాఁడనుట.)

అపర=పడమటి. కుహరమ్=గుహను. భాస్కరే= సూర్యుఁడు. అరోచత=ప్రకాశించెను. స్తనోహ పరికన్దళా=సమూహముయొక్క మొలకలుగలది. చరమ గిరి నితమ్బ లమ్బమాన శశాఙ్క బిమ్బమ్=పడమటి కొండ చఱియందు వ్రేలుచున్న చంద్ర మండలమును.

అరుణ శ్రేణి=(దం.) సూర్యునియొక్క కిరణ సమూహములచేత ఆకాశము పోయిన నక్షత్రములుగలది (నక్షత్రశూన్యము) కాఁగా.

చల తీతి= (దం.) చలించుచుండఁగా చల్లగాలి మెల్లమెల్లగా వేకువయందు.

యువ తీతి=(దం.) గుబ్బెతలసమూహము నాథులచేత కదలఁబడిన దొండపండు వంటి యధరోష్ఠముగలది యగుచుండఁగా.

కపాల శోధనా=తలను (లోపలివైపున) కడుగుట. శఫర శాబః=బేడిస పిల్ల. వికట...టితః=విషమమయిన ఫుమక యెముకలయొక్క సమీపమున ఇఱుకుకొన్నది. భిషగ్వరైః=ఉత్తమవైద్యులచేత.

అబ్జ బిమ్బ ఉపమమ్=చంద్ర బింబము సాటిగాఁగలది. గ్లీబస్య=నపుంసకునియొక్క. విపినే=అడవిలో. శిఖావాన్=అగ్ని.

గదః=రోగము. సంయతాక్షరామ్=కట్టఁబడిన యక్షరములు గలదైన. అస్మద్విషయే=మా దేశములో. న వసతిమ్ ఆతనోతు=నివసింపకుండును గాక. బాహట ఆది భేషజ కోశాన్=బాహటము మొదలయిన వైద్య గ్రంథములను. స్రోతసి=ఏటిలో. అవరోధన మాజాః=అంతఃపుర స్త్రీ సమూహములు, పురన్దరః=ఇంద్రుఁడు. వీణామునిమ్=నారదమునిని. నిష్క్రామితాః=తఱుమఁగొట్టఁబడిరి. నిరస్తమ్=పాఱవేయఁబడినది. పురుహూతః=ఇంద్రుఁడు. నాసత్యౌ=అశ్వినీసుతులను. ధన్వన్తరీయమ్=ధన్వంతరిదైన. ఆహతుః=చెప్పినారు. న వ్యళీకమ్= అబద్ధము కాదు. పాఠీనః=బేడిస. స్మయమాన=నవ్వుచున్న. నికేతనమ్=ఉనికిపట్టు. ఊచతుః=చెప్పినారు. మోహయిత్వా=దేహముమీఁది స్మృతి తప్పించి. సంధానకరణ్యా=ఎముకలనదుకునట్టి యౌషధముచేత.

అన్తర్ అధత్తామ్=అంతర్ధానము పొందిరి. స్నిగ్ధమ్=నేయిగలది.

కవి కుల తిలక=కవి సమూహముయొక్క తిలకములచేత (కవిశ్రేష్ఠులచేత). గాథా సనాథా చీటికా= పద్యముతో కూడుకొన్నదైన చీటి.

కరణ్డమ్=(బరిణను). వ్యాళమ్= పామును. గౌరీకాన్తమ్=శివుని. పవనతనయమ్ ఆంజనేయులవారిని. చమ్పకమ్=సంపంగిని.

దేశాన్తరగత కాన్తాయాః=దేశాంతరము పోయిన కాంతుఁడుగలదానియొక్క. తత్తద్భావప్రతిభట వర్ణనేన=ఆయాపదార్థములయొక్క శత్రువులచు వర్ణించుటచేత. (పాము మొదలయినవి వరుసగా మలయమారుతము మన్మథుఁడు ఉద్యానవనము తుమ్మెదలు—వీనికి శత్రువులు. మలయమారుతాదులచేత మిక్కిలి బాధపడుచున్నాను. శీఘ్రముగా వచ్చి నన్నుఁగూడి ఆబాధను తీర్పవలయును అని ఆమెయభిప్రాయము.)

**77.**—శిలా గో భూరుహేషు= రాయి ఆవు చెట్టు వీనియందును (కేవల జడపదార్థములందును జడజంతువులందును అని ధ్వని. చింతామణి కామధేను కల్పవృక్షములయందు అని భా.)

విరహిణీ గూఢ నర్మోక్తి పద్యమ్=వియోగినియొక్క అభిప్రాయ గర్భితమయిన నత్యాశయద్యోతకపదముల పద్యమును.

సగమగ్రన్థమ్=(భోజుఁడు) వచ్చినప్పుడు (అతనిగూర్చి)లోకులు అనుకొనుసంగతిని తెలుపుశ్లోకమును. మృగయితుమ్= వెదకుటకు. సాధుపూర్వమ్=మంచిమాటలతో. విసంజ్ఞః=చైతన్యములేనివాఁడై. ప్రకారాన్తరేణ=మఱియొకవిధముగా.

శ్రీభోజమహారాజచరిత్ర టిప్పణము

సమాప్తము.

